# కార్మికులారా! కదలండి!



★

వి నో బా
జయప్రకాశ్ నారాయణ్

★

అనువాదం
ల వ ణం

★

సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
గాంధీభవన్ :: హైద్రాబాదు.

ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవాసంఘం పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
సంచాలకుడు :
శ్రీ రామకృష్ణ ధూత్
గాంధీభవన్, :: హైదరాబాదు.

★

తొలి ముద్రణ
ఏప్రిల్, 1957
ప్రతులు : ఐదువేలు
వెల : 15 నయాపైసలు

★

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు

# कर्मिकुलारा कदलंडि !

विनोबा और जयप्रकाश कृत
'मज़दूरों से'
का
तेलुगु अनुवाद

अनुवादक :
लवणम्

✦

पहली बार : ५,०००
मूल्य : १५ नये पैसे
अप्रैल, १९५७.

✦

प्रकाशक :
अ. भा. सर्वसेवासंघके लिये
सर्वोदय साहित्य प्रचार समिति के
संचालक,
श्री रामकृष्ण धूत
गांधी भवन, हैदराबाद.

✦

मुद्रक :
अजन्ता प्रिण्टर्स, सिकन्द्राबाद.

# కార్మికులారా! కదలండి!

## భూదాన కార్మికోద్యమము :1:

వేలకొద్దీ సంవత్సరాలనుండీ మానవ సమూహం ఈ భూమిపై జీవితాన్ని గడుపుచున్నది. తినుట, త్రాగుట, నిద్ర పోవుటవంటి అతి ముఖ్యమైన విషయాలు ఇతర జంతువులలో ఉన్నట్లే మనిషిలోనూ ఉన్నాయి. ఆదికాలం నుంచి నేటివరకూ ప్రతిదేశంలోనూ ఈ పరంపర ఇలా సాగివస్తూనే ఉంది. అయితే ప్రాతకాలంనాటి మానవ జీవితానికి, నేటి సమష్టి జీవితానికి స్వరూపంలో చాలా తేడాఉంది. పదివేల సంవత్సరాలక్రింద జీవించియున్న వ్యక్తి నేటి ప్రపంచానికి వచ్చిచూస్తే అతనికి ఈ ప్రపంచం ఎంతో మారినట్లు కనబడుతుంది. నేటి చాల విషయాలను, నేటి భాషలను, నేటి సామాజిక జీవిత విధానాలను, నేడు మన ముందున్న చాల సమస్యలను అతను అసలు అర్థమే చేసుకోలేడు.

మానవునకు అతని మనస్సునుండి ప్రేరణ లభిస్తుంది. అయితే మనస్సు స్వీయమైన, వ్యక్తిగత మనస్సు మాత్రమే

కాక సామాజిక సమష్టి మనస్సుకూడా ఒకటి ఉంటుంది. ఆ సామూహిక మనస్సు రోజు రోజుకూ మారుతూ ఉంటుంది. ప్రతి దేశంలోనూ అది వేరువేరుగా ఉంటుంది. ఆ యా కాలాలలో ఆ యా సమాజ మనస్సు ఒక్కొక్క రకంగా పనిచేస్తూ ఉంటుంది. నేడున్నట్టి రాకపోకల సాధనములు ఆనాడు లేవు. ఒక దేశంనుండి మరొక దేశానికి వార్తలు చేరుటకు చాలకాలం పట్టేది. నేడు మనవద్ద వార్తలను అతి త్వరగా చేర్చగల సాధనములున్నవి. ఒకేచోట కూర్చుని ప్రపంచమంతటి వార్తలు ఎప్పటి కప్పుడు తెలుసుకోవచ్చు. పురాతన కాలంలో ఈ సాధనాలన్నీ లేకపోయినా ఈ భూ ఖండంలో మానవులు ఎక్కడెక్కడ వ్యాపించియున్నా వారి సామూహిక మనస్సు దరిదాపు ఒక్క విధంగానే పనిచేస్తూ ఉండేది.

## ఒకేసారి ధర్మస్థాపనకు ప్రేరణ

2,500 సంవత్సరాల క్రిందటి కాలం మనం తీసుకుని చూస్తే ఆ సమయంలో భారత దేశంలో వైదిక, బౌద్ధ, జైన ధర్మతత్వములు ప్రజానీకంలో ఉండేవి. సమాజమందు అన్న పానాదుల వంటి విషయాలు ఎప్పటి రీతిని కొనసాగుతూ ఉండేవే; అవి కాక సమాజమంతా ఒకప్రేరణ పని చేస్తూ ఉండేది. దానికి పునాదిగా బుద్ధదేవుడు, మహావీరుడు అవత

రించారు. వారు ధర్మస్థాపన గావించారు. అదే సమయంలో చైనాలో లావోత్సే, కన్ఫ్యూషియస్ వంటివారు 'తావో' గురించి ఆలోచించేవారు. దానిఫలితంగా అచటకూడ ధర్మ స్థాపన జరిగింది. అంటే చైనా-భారత దేశాలు ఒకదాని గురించి మరొక దానికి అతి తక్కువ పరిచయమున్నా అచటి ప్రజలకు, అదే సమయంలో అట్టి 'ఆకలి'యే వేసిందన్నమాట. ఆ కాలంలోనే ఇరాన్, పాలస్తీనాలలో కూడా ఆ విధమైన ప్రేరణ కలిగినట్లు కనబడుతుంది. ఇరాన్‌లో జరథుష్ట, ఈజిప్టులో మూసా, పాలస్తీనాలో ఏసుక్రీస్తు-పారశీక ధర్మాన్ని, యూదు ధర్మాన్ని, క్రైస్తవ ధర్మాన్ని స్థాపించినట్లు మనం చూస్తున్నాము. అంటే ఆ ఐదువందల సంవత్సరాల లోపల ప్రపంచంలోని అన్ని దేశాలలో ధర్మ సంస్థాపన కార్యం జరిగినట్లు కనబడుతోంది.

చివరకు మానవులందరికీ ధర్మస్థాపన చేయవలెనను ఈ ఒకే ప్రేరణ ఎలాగలిగింది? వ్యక్తిమనస్సుకు పరమేశ్వరుని నుండి ప్రేరణ లభించినట్లే సమష్టి మనస్సుకు కూడా పరమేశ్వరుని నుండి ప్రేరణ లభిస్తుందని అనుకొనుటయే దీనికి జవాబు కాగలదు. మూసా పని చేయుచున్నపుడు, మరొక ప్రక్క లావోత్సే పనిచేస్తున్నారని మూసాకు తెలిసి యుండదు. ఆ రోజుల్లో ఒక ప్రాంతపు వార్తలు మరో ప్రాంతానికి వెళ్ల

టకు వందలాది సంవత్సరాలు పట్టేది. అయినప్పటికీ ఒక గాలివలె వ్యాపించేది. అందుకు సర్వప్రేరక, సర్వాంతర్యామి యైన పరమేశ్వరుడే కారణం అయి ఉంటాడు. ఒకవేళ మనకు "పరమేశ్వరుడు" అనే శబ్దం ఇష్టంలేకపోతే, మొత్తం ప్రపంచపు "వివేక శక్తి" (కాన్షస్) మనందరకూ సమానంగా ప్రేరణ నిస్తున్నదనవచ్చు. మనం పరమేశ్వరుడన్నా, వివేక శక్తి అన్నా-ఇవి రెండు శబ్దాలు; కాని అర్థమొకటే. పరమేశ్వ రుడనే శబ్దము వల్ల ఎంతలోతుగా దిగుటకు వీలుంటుందో అంతలోతుగా వివేకశక్తి అనే శబ్దంవల్ల దిగుటకు వీలులేదు. ఇంతకంటె ఇతరత్రా అర్థంలో తేడా ఏమీలేదు.

## ఒక్కసారిగా ధ్యాన - చింతనమునకు ప్రేరణ

ఇంకా కొంచెం ముందుకువెళ్లి 800 లేక వెయ్యి సం వత్సరాల ముందుకాలం చూద్దాము. అప్పుడు ధర్మస్థాపనకు కాక, ఉపాసనకు, ధ్యానమునకు, చింతనకు — అంటే శక్తు లను కేంద్రీకరించుకుని వాటిని వికసింప జేసుకొనుటకు ప్రేరణ కలిగేది. దానిని 'మిస్టిసిజం' (Mysticism) లేక భక్తియుగము అనవచ్చును. ఆ సమయంలో చాలమంది యోగులు (Mystic) అవతరించారు. ఒక్క భారతదేశంలోనే కాక, ఈజిప్టు, ఇటలీవంటి చాల దేశాలలో జన్మించారు. ప్రతి

ప్రదేశంలోనూ ఒకే విధమైన ధ్యానము, ఒకే విధమైన చింతనము, ఒకే విధమైన తపస్సు కొనసాగినట్లు కనబడుతోంది. అంటే మనస్సులో ఉన్న శక్తులను ఆహ్వానించి, జీవితమును శక్తివంతముగా చేసుకొని, దానిని సమాజహితము కొరకు ఉపయోగించుట ఈ కార్యముల ఉద్దేశ్యము. ఈ ఆధ్యాత్మిక పరిశోధనకార్యం సాగుతోంది. ఉత్తరదేశస్థులకు సూరదాసు, తులసీదాసు చక్కగా తెలుసు. వారు పర్యటించి తమభావాలను ప్రచారం చేశారు. నేడు మనం వారి మహిమను గానం చేస్తున్నాము. ఇట్టి సంతపురుషులు దక్షిణ భారత దేశంలోనూ, యూరపులోనూకూడా జన్మించారు. కాని మనకు వారు తెలియరు.

రెండువేల సంవత్సరాల పూర్వం సమాజ నిర్మాణపు మూలతత్వములను పరిశోధించాలని ప్రేరణ కలిగినట్లే, వీరికి మానసికశాస్త్రమును సంశోధించ వలెనను ప్రేరణ కలిగింది. అందరికీ ఒకే విధమైన ప్రేరణ కలుగుట, ఒకే రకమైన కోర్కెతో అందరి మానసములు మేల్కొనుట చాల విచిత్రమైన విషయము. ఇచ్చటి యోగులగురించి అచ్చటి యోగులకు ఏ సమాచారమూ తెలిసేదేకాదు. అయినప్పటికీ సమానమైన ప్రేరణ అందర్నీ ఉజ్జీవింపజేసి, మేల్కొల్పి, కార్యరతులను చేసింది.

స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయములకై తహతహ

ఇట్టి దృశ్యమునే సుమారు నూరు- నూటయాభై సంవత్సరాల క్రితం ఒక సారి చూచాము. అప్పటికి రాకపోకల సౌకర్యాలు ఏర్పడినవి. అన్నివిధముల వార్తలు ఒకరి నుండి మరొకరికి సులువుగానే అందడం ప్రారంభించాయి. ప్రపంచ మంతటా సమానత్వం, న్యాయం, స్వాతంత్ర్యం గురించి చర్చసాగింది. జీవితంలో సమానత తీసుకురావలసిన అవ సరం, స్వాతంత్ర్యం లభించవలసిన అవసరం మనం నేడు చూస్తూనే ఉన్నాము; ఈ ఉద్దేశ్యాలు నేడు అందరికీ ప్రేరణ నిస్తున్నాయి. అయితే రాకపోకల, వార్తల సౌకర్యా లున్నా ఒక దేశంలోని ఉద్యమం కారణంగానే ఇతరులకు ప్రేరణ కలుగుతుందని మనం అనలేము. అందరకూ వివిధ రూపాలలో ఒకే ప్రేరణ కలిగింది. అప్పటికి సమాజంలోని పునాది విషయాలు సంశోధించ బడ్డాయి. ఈ మధ్యకాలంలో ఆ మానసిక శక్తుల తత్వాలను ఆచరణలోనికి ఎలా తేవలెను అను విషయం కూడ పరిశోధించబడింది. కనుక స్వచ్ఛందంగా ధర్మ సంస్థాపన జరిగి, దాని అమలుకు మానసిక శక్తుల సంశోధనం జరిగినప్పుడు, ఇక ఇప్పుడు ఆత్మలో వర్తమాన శక్తిని సాక్షాత్కరింపజేయ వలెనని కోరిక గలుగుటచే, ఆ మూల సిద్ధాంతములను సమాజ నిర్మాణమందు తీసుకొన

వలెను. అందరిలోనూ ఒకే ఆత్మ నివసిస్తున్నది అను ఆధ్యాత్మిక తత్వమును మనం ప్రాచీనకాలం నుండి అంగీకరించాము. అయినా ఇప్పుడు దానిని జీవితములోనికి తేవలసియున్నది. ఆ తత్వమును అంగీకరిస్తున్నా, నేటి వరకూ మన జీవితములో అన్నిరకముల అసమానతలు, భేదములు, స్థాయిలు ఉన్నవి. అస్పృశ్యత ఉంది.

అందరిలోనూ ఒకేరకమైన జ్యోతి ఉన్నది అనే విషయాన్ని మొత్తం ప్రపంచమంతా పరిశోధించింది. అందుకుగాను మానసిక ప్రవృత్తుల సంశోధనకూడ పూర్తి అయినది. అయితే, ఆ సమానత్వమును ఇప్పుడు ప్రత్యక్షముగా జీవితములోనికి తేవలసిన సమయం వచ్చింది. ప్రతిచోటా ఈ విషయమయ్యే ఆకలి పుట్టింది. స్వాతంత్ర్యం, న్యాయం, సమానత్వం అనే భావాలు ప్రపంచంలోని ప్రతి దేశంలోనూ వ్యాపించాయి. మనం సూక్ష్మంగా, తటస్థంగా, సరియైన విధానంలోనూ పరిశీలిస్తే, ప్రతి దేశంలోనూ ఈ భావం స్వతంత్రంగానే వ్యాపించింది అని చెప్పగలము. సూర్యోదయం కానున్న దనగా అయోధ్యలోని కోడి కూసినట్లే, నాగపూరులోని కోడికూడా కూస్తుంది. సూర్యోదయం కారణంగా ప్రపంచంలోని కోళ్లన్నిటికీ సమానంగానే ప్రేరణ లభిస్తుంది. అట్లే, ఈ కాలంలోకూడ అందరికీ సమానంగానే ప్రేరణ

లభించింది. అయితే నేడు ఒక మార్పు వచ్చింది. కాలగతి పెరిగింది. ఆ కారణంగా లోగడ 200 సంవత్సరాలు పట్టే కార్యం, ఇప్పుడు 5 సంవత్సరాలలోనే జరగ నారంభమైంది.

## కాంగ్రెసు ఉద్దేశ్యాలు

ఇంకా సమీప కాలానికి వద్దాం. 60-70 సంవత్సరాల క్రిందటి స్థితిని చూస్తే ప్రపంచంలోని చాల దేశాలలో ఒకే రకమైన కార్యం ఆరంభమైనట్లు కనబడుతుంది. భారత దేశంలో కాంగ్రెసు పనిచేయడం ప్రారంభించింది. అందు దేశం లోని అన్ని ప్రాంతాలవారు, అన్ని మతాలవారు, చివరకు ఆంగ్లేయులు సహితం పాల్గొన్నారు. తమ స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించుట కాంగ్రెసుపని. అంతకు పూర్వంకూడ భారతీయు లలో స్వాతంత్ర్య పిపాస లేకపోలేదు. కాని ప్రారంభంలో ఎట్టి స్థితి ఏర్పడుతుందంటే, ముందు బాలుడు ఏడ్చి తన ఆకలిని ప్రకటిస్తాడు. అదే కొంచెం పెరిగి, అతనికి మాట్లాడే శక్తి రాగానే అడుగుతాడు. ఆ పైన పెద్దవాడైతే స్వయంగా అన్నం వండుకుని తింటాడు. మానవుడు పెద్దవాడౌతున్నకొద్దీ, అత్యధికస్పష్టంగాను, బలంగాను తన భావములను ప్రకటిస్తాడు. కాంగ్రెసు రూపంలో మనం వాణి ద్వారా మన ఆ ఆకలిని ప్రకటించాము.

స్వాతంత్ర్యం సంపాదించుకొనుటకు మన మొక ప్రత్యేక విధానాన్ని అవలంబించాము; దైవ కృపవల్ల మనకు అందుకు తగిన నాయకుడు లభించాడు. అన్యాయాలనుండి విముక్తులం కావలెనను, ఇట్టి స్వాతంత్ర్య ప్రేరణయే నాడు ప్రపంచ ప్రజానీకమంతటికి కలిగింది. ఆనాడు కాంగ్రెసుఅంటే స్వాతంత్ర్యం, సమానత్వం, హెచ్చుతగ్గులను తీసివేయడం అని అర్థం; సరిగా అదేసమయంలో రాజకీయ స్వాతంత్ర్య సమస్య లేని దేశాలలో కార్మిక సమస్య ఉదయించింది. అందుచే ఐరోపాలో శ్రామికులకు స్వాతంత్ర్యం ఇప్పించా లనే ఉద్యమం ఆరంభమైంది. ప్రపంచంలోని కార్మికులందరూ ఒకటే. అందరికి సమానంగానే హక్కులున్నాయి. కనుక అందరికీ స్వేచ్ఛ లభించాలి అనే ఉద్యమం అక్కడ సాగింది. నేడు మే మొదటితేదీ; సర్వత్రా 'మే డే'గా జరుపుతారు. ఈ కార్మికోద్యమం- కాంగ్రెసుల ఆశయాల్లో ఏమీ తేడాలేదు. కేవ లం పరిస్థితులు మాత్రమే భిన్నమైనవి. పారతంత్ర్యంలో ఉండిన కారణంగా మనం రాజకీయ స్వాతంత్ర్యానికి హెచ్చు ప్రాముఖ్యత ఇచ్చామేగాని, మన స్వరాజ్య సమరంలో ఇంకా ఇతర ఉద్దేశ్యాలుకూడా ఉండినవి. అన్ని రకముల సమానత, న్యాయము, స్త్రీలకు- హరిజనులకు స్వాతంత్ర్యము వంటి సమ స్యలు అందులో ఇమిడియున్నవి. ఆ సమస్యలన్నీ కాంగ్రెసు

ద్వారా ప్రకటించబడినవి. అటు కార్మికోద్యమాలలో కూడ ఈ విషయాలే ఉండెను.

## మా ఉద్యమం కార్మికోద్యమం

నేడు 'మేడే'. ఈ సందర్భంలోనే నా ఈ ఉపన్యాసము. ఎవరైతే అందరికంటే బలహీనులో, ఎవరికి భూమిలేదో, ఎవరు గొంతెత్తి తమ గోడు చెప్పుకోలేరో అట్టివారందరిదీ ఈ ఉద్యమం. సాధారణంగా కార్మికోద్యమాలు పట్టణాలలో ఉంటాయి. ఐరోపాలో కర్షకోద్యమాలు కూడ సాగాయి. కాని భారత దేశంలో హెచ్చుగా పట్టణాలలోనే ఇట్టి ఉద్యమాలు కొనసాగుతూ ఉంటాయి. గ్రామాలలోని కార్మికులు సంఘటితులై లేరు. వారిలో జాగృతి కలగలేదు. వారికి చదువు లేదు. చివరకు ఏ పొలంపై వారు సేద్యంచేస్తున్నారో దానికైనా వారు యజమానులు కారు. వారు వ్యవసాయ కూలీలు. కనుక అందరికంటె నికృష్టశ్రేణికి చెందినవారు, వారి సమస్యను నేను తీసుకున్నాను. ఎవరైతే అందరికంటె ఎక్కువగా అడుగున వున్నారో అట్టివారి సమస్యను ముందుగా తీసుకొనుటయే సర్వోదయము-అహింసల విధానము. ఎందుచేతనంటే చిట్టచివర ఉన్న వారిని పైకిలేవనెత్త వలసియుంది. ఆ పైన అందరూ పైకి లేవగలరు. అప్పుడు

పైనున్న వారి కొరకు స్వాతంత్ర్యోద్యమం సాగించవలసిన పని ఉండదు.

నేను క్రిందనున్నవారిని అభివృద్ధి పరచుటకే కృషి చేస్తున్నానని నామీద ఆక్షేపణ ఉంది. సముద్రస్నానంవల్ల అన్ని నదులలో స్నానం చేసిన పుణ్యం లభిస్తుంది. ఆపైన వేరువేరుగా నదులలో స్నానం చేయవలసిన అవసరం ఉండదు. అట్లే ఈ పనీను. అయితే దీనివల్ల ఒకరికి లాభం, మరొకరికి నష్టం జరగని విధానంలో ఇది ఉండాలి. మనం ఇట్టి విధానాన్ని అవలంబిస్తే మొత్తం సమాజమంతా అభివృద్ధి చెందుతుంది. సర్వోదయం, అహింసల విధానం ఎట్టిదంటే దానివల్ల మిగిలిన వారందరూ తమంత తామే అభివృద్ధి చెందగలరు. "మీరు మధ్య తరగతి ప్రజలకు, పట్టణాలలో ఉండే శ్రామికులకు ఏమిచేశారు?" అని ఒకరు నన్ను అడిగారు. అప్పుడు నేను తమాషాగా ప్రపంచంలోని సమస్యలన్నీ నేనే పరిష్కరిస్తాననే గుత్త ఏమీ తీసుకోలేదు అన్నాను. అయితే అది వినోదం కొరకు అన్న విషయం మాత్రమే. "ఏదేనా ఒకటి ముందు పూర్తిచేస్తే తర్వాత అన్నీపూర్తి అవుతాయి. అన్నీ పూర్తి చేద్దామని మొదలు పెడితే ఏదీ పూర్తికాదు." కనుక సమత, న్యాయం, భూతదయ, సానుభూతి కొరకు ఒక వాతావరణాన్ని నేను నిర్మించ దలిచాను.

దానివల్ల మిగిలిన సమస్యలు వాటంతట అవే పరిష్కరింప బడగలవు. ఒక వేళ అలా తమంత తాము పరిష్కరింప బడకపోతే కొద్ది ఉద్యమాన్ని సాగించి పరిష్కరించగలము.

## భూదానోద్యమాన్ని చూచుటకు విభిన్న దృక్పథాలు

నా పనిని చూచుటకు అనేక దృష్టు లున్నవి. 'మేడే' సందర్భంలో నా ఉద్యమం కార్మికోద్యమమని ఈ ఒక దృక్ప థాన్ని మీ ముందు పెట్టాను. నన్ను నేను ఒక కార్మికుడ ననుకుంటాను. నా జీవితంలో 'బెస్టు ఈయర్సు' అనబడే యౌవనకాలంలోని 32 సంవత్సరాలు శ్రమలో గడిపాను. వాటి అవసరం ఎక్కువగానే ఉన్నా సమాజం వేటిని నీచమని ఎంచుతుందో-వేటికి ప్రతిష్ఠలేదో అట్టి పనులు నేను చాల చేశాను. పాకీపని, వడ్రంగం, వ్యవసాయం వంటి పనులు చేశాను. నేడు గాంధీ లేరు. కనుక నే నిలా బయటకు వచ్చాను. వారు ఉండి ఉన్నట్లయితే నేను బయటకి వచ్చే వాడినికాను. నన్ను ఏకూలి పని చేస్తున్నట్లుగానో మీరు చూచే వారు. జన్మతః నేనుబ్రహ్మనిష్ఠ, అపరిగ్రహముతో కూడిన బ్రాహ్మణుడనైనా కర్మతః నేను కార్మికుణ్ణి. బ్రహ్మనిష్ఠ నేను విడువలేను. ఏపనినైనా చూచుటకు ప్రతివారికీ తమ తమ వేరు దృక్పథముంటుంది. రాముడు నిలిచియుంటే వారిని చూచేవారు ఎటువంటి ప్రజలైతే ఆ విధంగా రాముడు వారి

కగుపించాడు అని తులసీదాసు వ్రాశాడు. విశాలమైన కార్యములకు అనేక సమస్యలుంటాయి. కనుక వాటిని ఎన్నో దృక్కోణాలనుండి చూడవచ్చును. నాపనివల్ల భూసమస్య పరిష్కారం కావచ్చును. ఆహారోత్పత్తి పెరగవచ్చును. న్యాయం పెంపొందవచ్చును. గ్రామాలు సంఘటితం కావచ్చును. రాజకీయాలపై దీని ప్రభావం హెచ్చుగా పడవచ్చును. ప్రజలలో ధర్మభావన వికసించవచ్చును. ప్రజలలో అజ్ఞాతంగా పడిఉండిన ధర్మభావనను, దానము దయల ప్రవృత్తులను మేల్కొల్ప వచ్చును. నాపనిని ఇదిధార్మికకార్యము, భారతీయ ఆధ్యాత్మిక పరంపరకు అనుకూలమైనది అనీ చూడవచ్చు లేదా ఇది ఒక గొప్ప కార్మికోద్యమమనీ చెప్పవచ్చు.

## పరమేశ్వర ప్రేరణతో కార్యారంభం

ఇదంతా నేనై చేయలేదు. నేను చేయవలసివచ్చింది. హైద్రాబాదు (శివరాంపల్లి)లో జరిగిన సర్వోదయ సమ్మేళనానంతరం ఒక అహింసాయుత నిరీక్షకుడుగా తెలంగాణకు వెళ్లాను. అచ్చటి ప్రమాదభరిత కల్లోలాన్ని అణచుటకు ప్రభుత్వం సాలీనా 5 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టింది. అయినా అణగలేదు. అందుచేత అహింస ఎలాపనిచేయగలుగుతుందో చూద్దామని, వినమ్రుడనై వెళ్లాను. నేను అచ్చటి పరిస్థితిని చూచాను. వ్యవసాయదారుల సమస్యను ముందు తీసుకో

వాలన్నట్లుగా నాకు సూచన లభించింది. భూమిపై సేద్యం చేస్తూ భూమిహీనులై యున్న కూలీల సమస్యను ముందుగా తీసుకోవలసి యుందనిపించింది. నాలో శక్తి లేదు అం దెను. అయినా అందుకు పూనుకొనవలసివచ్చింది. అలా పూనుకోక పోతే నేను పిరికిపందనై యుండేవాడిని, ధర్మాన్ని మరచినట్ల య్యేది. ఈ పనిని చేయమని నాకు ప్రేరణకల్పించిన పరమే శ్వరుడే శక్తినీ యివ్వగలడను విశ్వాసంతో ఇందుకు పూను కున్నాను. దేవునిపై, అంటే మీ అందరిపై నమ్మకంతో నేనీ పనికి దిగాను. నన్ను దానమడగమని ఏపరమేశ్వరుడైతే నాకు ప్రేరణ నిస్తున్నాడో, ఆ పరమేశ్వరుడే మీకు దానమిచ్చుటకు ప్రేరణ కలిగించగలడు. అతను ఒకవైపే పనిచేయడనీ, విస్తృతంగా అన్నీ ఆలోచించే వాడనీ నా నమ్మకము. ఇది అహింసాయుత విధానము.

## సవ్యమార్గాన్నే మనం వెళ్ళాలి

ప్రపంచంలోని చాల దేశాలలో వ్యవసాయ కూలీల ఉద్యమాలు కూడా సాగాయి. కాని మన దేశంలో ఎవరి దృష్టి ఆ వైపు అంతగా పోలేదు. కమ్యూనిష్టులు మాత్రం తెలంగాణాలో అందుకు పూనుకున్నారు. మిగిలినవన్నీ పట్ట ణాలలోని కార్మికోద్యమాలు. ప్రపంచంలో ఎవరికి వారు తమకు తోచిన రీతిని ఈ సమస్యను పరిష్కరించారు.

అయితే వారి విధానం సవ్యమైనదికాదు. నేను వాటిని అనుసరించను. దానివల్ల ప్రపంచానికి ఎన్నడూ మేలు చేకూరలేదనీ, ఇక ముందు కూడ మేలు జరగదనీ నే ననుకుంటాను. భారతదేశానికి ఆ రీతులు హానికారకములని నా భావన. నాలో, మీలో, భారతదేశంలో ఒక ప్రత్యేకత ఉందనుకుంటాను. నేను యీ మూడు ఒకటే ననుకుంటాను. మన విధానం ప్రత్యేకమైనది. బలవంతాన తీసుకుంటే భూమి త్వరగా లభిస్తుందని నిన్న ఒకరన్నారు. 'నేను బలవంతం చేయదలచలేదు. నెమ్మదిగా జరిగినా పర్వాలేదుగాని, నా మార్గంలోనే పని జరగాలి. నాకు హింస నచ్చదు' అని నేను జవాబిచ్చాను. నా విధానం అహింసా విధానం, సర్వోదయ విధానం, భారతీయ సంస్కృతీ పరంపరకు చెందిన విధానం. నేతి డబ్బాకు నిప్పు ముట్టిస్తే నెయ్యి మండిపోతుంది. వేదమంత్రాలతో యజ్ఞమందు దానిని ఆహుతిగా ఇచ్చినా అది మండుతుంది. రెంటిలోనూ నెయ్యి కాలిపోతుంది. కాని ఒకదానిలో భావం మండి మాడిపోతే, మరొక దానిలో అతి పవిత్రమౌతోంది. హింసాయుత విధానంలో ఒక సమస్యను పరిష్కరిస్తే మరొక సమస్య తయారౌతుంది. హింసాయుత విధానంలో క్రొత్త క్రొత్త సమస్యలు ఉదయిస్తాయి.

మనం స్వాతంత్ర్య ప్రాప్తికి అనుసరించిన విధానం ఇచ్చటనే రూపొంద గలిగింది. ఎందుచేతనంటే అది భారతీయ సభ్యతకు అనురూపమైనది. అందుకు సుయోగ్యుడైన నాయకుడూ లభించాడు. అట్టి పరిశుద్ధమైన విధానంలోనే మనం ఇతర సమస్యలను కూడా పరిష్కరించుకోవలసియుంది. 'అగ్నేనయ సుపథారాయే'—అగ్నిదేవా, మమ్మ సన్మార్గాన నడిపించు- అని ఉపనిషత్తుల్లో ఉంది. ఖురాన్‌లోకూడా ఇట్లే చెప్పారు. "ఇహ్దినస్ సిరాతల్ ముస్తకీమ్, సిరాతల్ లజీన్ అన్ అమ్తు అలైహిమ్." అంటే ఓ భగవంతుడా! మాకు సూటి బాటను మాత్రమే చూపు. తప్పు మార్గాన మేము లక్ష్యం చేరలేము అని. ఒక్కొక్కప్పుడు మనం లక్ష్యం చేరినట్లే కనబడుతుంది. కాని 'స్వర్గానికి' బదులుగా 'నరకానికి' వెళ్ళిపోతాము. అందుచేత సక్రమ మార్గాన లక్ష్యంవైపు వెళ్ళాలనుకుంటున్నాము.

## క్షమ, సమతలలోని అవిరోధం

కార్మికులకు కేవలం అన్నవస్త్రాలిస్తే చాలదు. ఇది కేవలం భౌతిక సమస్య మాత్రమే కాదు. నా దృష్టిలో ఏ సమస్యకూడా కేవలం ఆర్థిక సమస్య కాజాలదు. మనం లోతుకు వెళ్లిచూస్తే భౌతిక సమస్యలు ఆధ్యాత్మిక నైతిక సమస్యలై యుంటాయి. అట్లే ఈ సమస్యకూడా ఆధ్యాత్మికం.

పేదవారికి సమానత్వం కావాలి, న్యాయం కావాలి అని నేనంటే మాకు వ్యతిరేకులుకూడా అందుకు అంగీకరిస్తారు. వారూ అసమానత్వం ఉండాలని అనరు. కాని భూమి చిన్న చిన్న ముక్కలు కారాదని వారంటారు. మనం సమానత్వం కావాలంటే వారు అసమానత్వం కావాలని అనరుగాని క్షమ (ఓరిమి) ఉండా లంటారు.

వారు 'సమానతకు విరుద్ధమైన అసమానత'కావాలని అనలేరు; ఎందుచేతనంటే అసమానతను ఎవరూ కోరరు ప్రకాశంముందు అంధకారం నిలువజాలదు. రామునికి వ్యతిరేకంగా రావణుడు యుద్ధంచేయలేడు. కాని, అర్జునునికి వ్యతిరేకంగా భీష్ముడుంటేమాత్రం యుద్ధం జరుగగలదు. మంచి శబ్దానికి వ్యతిరేకంగా మంచి శబాన్ని తెస్తేనే యుద్ధంచేయ. గలరు. రామరావణ యుద్ధం ఒక విచిత్ర విషయం. సూర్యునికీ అంధకారానికీ ఘోరయుద్ధం జరిగిందనీ, అంధకారసమూహం సూర్యునిపై దాడిజరుపగా, సూర్యకిరణాలు అంధకారాన్ని నాశనంచేశాయనీ మనం అంటే అది కేవలం వర్ణనయే కాగలదు. ఎందుచేతనంటే సూర్యోదయంతోపాటు అంధకారం నాశనమైతీరవలసిందే. అట్లే రాముడువచ్చేడనగానే రావణుడు నశించి తీరుతాడు. సూర్యుని ఎదుట అంధకారం నిలువజాలదు. రాముని ఎదుట రావణుడు నిలువజాలడు. అట్లే సమానత్వానికి

వ్యతిరేకంగా అసమానతలు నిలువలేవు. అయితే సమానత్వానికి వ్యతిరేకంగా క్షమను తెస్తే మాత్రం యుద్ధం సంభవం. క్షమయందు విశ్వాసంగలవారు, క్షమకు పెద్దపెద్ద భూఖండాలు కావాలంటారు. అప్పుడు విభిన్నదృక్పథాలవారు ఒక నూతన దృక్పథాన్ని వెల్లడించుచు, అందు సమతతోపాటు క్షమకూడ ఉండగలదంటారు. సమత ఉన్నచోట క్షమ ఉండగలదు: "యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః"

కార్మిక సమస్యలను ఏకాంగీణంగా, హింసావిధానంతో పరిష్కరించాలనేవారు ఎన్నడూ విజయం పొందలేరు. సమానత్వం రక్షింపబడి, కార్మికుల బాధలుపోయి, క్షమ తదితర గుణాలుకూడ కూడిరాగలవిధానంలో, అట్టి నేర్పరితనంతో నేను పనిచేయాలనుకుంటున్నాను.

## పెట్టుబడిదారీ సమాజంలో కొన్ని తలలు, కొన్ని చేతులు!

నేడు భారత దేశమంతా కూలీలైపోయారు. వారికి బుద్ధి నుపయోగించుట తెలియదు. లక్షల కొద్ది జనానికి విద్య లేకుండా చేశాము. వీరంతా ధన, మాన, విజ్ఞాన విహీనులై యున్నారు. అట్టితరి వారిలో క్షమ ఎలా వస్తుంది? నేడు గ్రామంలో మంచి వడ్రంగి కూడా దొరకడు. రాట్నమునకు

క్రొత్త 'మోడల్' తయారు చేయవలెనంటే, గ్రామ వడ్రంగి చేయలేడు. అందుకుగాను అతనికి 5 సంవత్సరాల శిక్షణ నివ్వవలసి వస్తున్నది. మన పనివాండ్రు 'అన్‌స్కిల్డు' (నిపుణతలేని) కూలీలు. వారికి జ్ఞానమూలేదు, ప్రతిష్ఠాలేదు, ధ్యేయమూలేదు. పెట్టుబడిదారీ సమాజంలో కొందరు బుద్ధి శ్రమ మాత్రమే చేస్తారు; కొందరు యంత్రంవలె పనిచేస్తారు- అట్టివారు తమ బుద్ధి నుపయోగించరు. ఎవరికైనా చాకులకు కన్నంవేసే పని అప్పచెబితే, రోజూ 5 వేల చాకులకు కన్నాలు వేస్తాడు; జీవితమంతా అదే పనిచేస్తాడు. ఈ విధమైన పని ఇస్తే క్షమ, నిపుణత రాగలవని వారంటారు. వారు మానవ జీవితాన్ని సర్వాంగీణం కానివ్వరు. పెట్టుబడిదారీ సమాజంలో కొందరు 'హెడ్సు' (తలలు) అవుతారు; కొందరు 'హేండ్సు' (చేతులు) అవుతారు. ఉదాహరణకు: మిల్ హేండ్సు, హెడ్ మాష్టరు, హెడ్‌క్లర్కు వగైరాలు. అంటే ఒక వేపు అన్నీ తలలే తలలు, మరొక వైపు అన్నీ చేతులే చేతులు! దీనివల్ల క్షమ రాగలదని వారంటారు. వారి దృష్టిలో సర్వాంగ పరి పూర్ణమైన మనిషి క్షమకు వ్యతిరేకి!

## సర్వవర్ణముల ధర్మము

చాతుర్వర్ణ్యమందుకూడ కొంతమంది ఈ విధంగా ఊహించారు. అందు బ్రాహ్మణుడు పాకీపని చేయరాదు. కాని

ఈ ఊహ తప్పు. చాతుర్వర్ణ్యమంటే నాలుగు వర్గాలలోనూ నాలుగువర్ణాలూ ఉంటాయి. అయితే ఒకదానిలో ఒకగుణం ప్రధానంగా ఉంటే మిగిలినవి అప్రధానంగా ఉంటాయి. భగవంతుడగు శ్రీకృష్ణుడు యుద్ధసమయంలో కేవలం యుద్ధం చేయుటయే కాక గుఱ్ఱాలనుకూడ కడిగేవారు. ఆసమయంలో అది క్షత్రియ కార్యంకాదని వారనలేదు. అర్జునుని మోహం త్రెంచవలసి వచ్చినప్పుడు గీతోపదేశం చేశారుగాని "ఇది బ్రాహ్మణ కార్యముకనుక నీ శంకాముక్తికి ఏ బ్రాహ్మణుని వద్దకో వెళ్లు" అని అర్జునునితో అనలేదు. శ్రీకృష్ణుడు సమయానుకూలంగా యాదవ, బ్రాహ్మణ, శూద్రులయ్యేవారు. వారు ఎట్లూ క్షత్రియులే. కనుక వారు ఎలాగూ యుద్ధం చేయవలసి వచ్చేది. ఇట్లు చాతుర్వర్ణ్యంలో ఎవరి పని వారు ఎలాగూ చేస్తారు, దానితోపాటు ఇతర పనులూ చేయాలి.

ఒకసారి ఒక గణిత శాస్త్రజ్ఞుణ్ణి "రైలు స్టేషను ఎక్కడ"అని అడిగారు. తనకు భూగోళం తెలీదన్నాడు. ఇట్లా అతనంటే అతను సరియైన పౌరుడుకాడు. గణితశాస్త్ర అధ్యాపకుడైనా అతనికి భూగోళ విషయమై ఈ మాత్రం సామాన్య జ్ఞానం ఉండాలి. 'ధర్మోఽయం సార్వవర్ణికః' అని శాస్త్రాలలో చెప్పారు. అందరికీ సమానంగా అన్ని గుణాలూ కావాలి. అయితే ప్రతివారికీ వారి వారి వర్ణంబట్టి వేరు వేరు గుణాలలో

ప్రత్యేకతకూడ ఉంటుంది. ప్రత్యేకతలను ఉంచి అందరినీ పరిపూర్ణ మానవులుగా తయారుచేయుట దాని ఉద్దేశ్యము. అందరికీ మనస్సు, చెయ్యి, తల- అన్ని అవయవాలు ఇవ్వబడినాయి గనుక అందరూ అన్ని పనులూ చేయాలి. అయితే ఒక ప్రత్యేక పనికి హెచ్చుసమయం యివ్వవచ్చును.

యజమాని ప్రధానమైన కూలి—

—కూలి ప్రధానమైన యజమాని

కార్మిక, యజమాని తేడా పోవాలని నా ఆకాంక్ష. యజమానుల బుద్ధిని ఉపయోగించ దలచుకోలేదని నా అర్థం కాదు. యజమాని కూలికూడ అవుతాడు; కూలి యజమాని కూడ అవుతాడు. కొంతమంది యజమాని ప్రధానమైన కూలీలవుతారు; వారు చేతులతో పని చేస్తూ బుద్ధి పరిశ్రమను అధికంగా చేస్తారు. కొందరు కూలి ప్రధానమైన యజమానులవుతారు; వారు బుద్ధి పరిశ్రమ చేస్తూనే శారీరక పరిశ్రమ అధికంగా చేస్తారు. బుద్ధి ప్రధానమైన శరీర శ్రమచేసే వారు, శరీరశ్రమ ప్రధానమైన బుద్ధి శ్రమ చేసేవారు- అనునట్టి స్థితికి సమాజ నిర్మాణం జరగాలి. దేవుడు ఇట్లు కోరియుండక పోతే కొందరికి చేతులే ఇచ్చి, కొందరికి బుద్ధి(తల) మాత్రమే యిచ్చియుండేవాడు. రాహు- కేతువులవలె అందరూ అసం

పూర్ణంగానే ఉండేవారు. కాని అందరూ పరిపూర్ణజీవితం గడపగలందులకుగాను అందర్నీ దేవుడు పరిపూర్ణులుగ చేశాడు.

యజమాని — కూలి తేడాను మేము తీసివేయ దలచి నామంటే దాని అర్థం కూలివాని శ్రమశక్తి, యజమాని వ్యవస్థాశక్తుల వికాసమును మెము కోరుట లేదనికాదు. మేము ఇద్దర్నీ రెండువిధముల శక్తులతోనూ వికసింప జేయాలని కోరుతున్నాము. మేము సమానత్వాన్ని తేగోరు తున్నాము; క్షమనూ పోగొట్టుగొన గోరుటలేదు.

ఫైజాబాదు
1—5—52

— వినోబా

# సర్వోదయ నిష్ఠగల కార్మికోద్యమము :2:

ప్రపంచములో సోషలిస్టు, కమ్యూనిస్టు తత్వములు విప్లవాత్మకములని అనబడుచున్నవి. పీడింపబడుచున్న వర్గములు తమ పీడనను తొలగించుకొనుటకు కృషిచేయవలెనని, ఆ కృషి హింసాత్మకమైనా సరే, శాసన రీత్యాయైనా సరే, ప్రయత్నించవలెనని, ఈ తత్వములు చెప్పుచున్నవి. అవి తమ అభివృద్ధికొరకు లేబర్‌పార్టీ రూపములో కాని, సోషలిస్టు లేక కమ్యూనిస్టు పార్టీ రూపములో కాని ఏదో కొంత కృషిని తప్పక చేయగలవు. ఏదీ కాకపోతే కనీసము ట్రేడ్ యూనియన్లనయినా నిర్మించగలవు.

## నేటి కార్మికోద్యమము

కార్మికోద్యమము తొలిగా ఇంగ్లండులో ప్రారంభమైనది. ఈ $1\frac{1}{2}$ శతాబ్దములో అచట కార్మికోద్యమము ఏ విధముగా అభివృద్ధి చెందినదో మనకు తెలియును. అమెరికాలో కూడ కార్మికోద్యమమున్నది. అయితే అచ్చటి కార్మికోద్యమము సమాజములో విప్లవాత్మకమైన మార్పులను తెచ్చినదని నేను భావించను. రష్యా, చైనావంటి దేశాలలో శ్రామికుల రాజ్యమే ఏర్పడి యున్నది. కనుక శ్రామికులు

ప్రత్యేకముగా తమ సంఘటనలను ఏర్పరచుకొనుటకు అధికారము లేదు. అచటకూడ అసమానత యున్నది. అచట కూడా ఎక్కువగా సంపాదించినది ఏమీ లేదు. అమెరికాలో అల్పసంఖ్యాకోద్యమము, రష్యాలో బహుజనోద్యమము యున్నవేకాని ఎచటను సర్వోదయము లేదని కుమారప్పగారు చెప్పియే యున్నారు.

## స్వార్థభావము తప్పు

అందుచేత సర్వోదయ దృష్టితో చూస్తున్నప్పుడు కార్మిక నాయకులు, కార్మికులు ఈ విషయాన్ని-సర్వోదయ దృష్టిని తెలిసికోగలుగుతే 100, 150 సం॥లలో జరుగని పని 10, 15 సం॥లలో జరుగగలదు. నేడు మనము కార్మికోద్యమము నిర్మిస్తున్నామంటే కార్మికులతో "నువ్వు పీడింపబడుతున్నావు. నువ్వు ఉత్పత్తి చేస్తున్నావు. నువ్వు నీ భాగము మాత్రమే పనిచేయవలసి యుండగా నీచేత ఎక్కువ పని చేయిస్తున్నారు. నీకు యివ్వవలసిన సౌకర్యాలు యివ్వడము లేదు. వసతి విషయములో, వైద్య విద్యా సౌకర్యములలో నీవు ఉపేక్షింప బడుతున్నావు" అని మనము వారితో చెప్పుతున్నాము. శ్రామికులు సంఘటితులై తమ స్వార్థమునకై పోరాడుటకొరకే కార్మికోద్యమాలు బయలుదేరుతున్నాయి. నేడు శ్రామికులు తమ పొట్టకూటికోసము పనిచేస్తూ తమ

స్వార్థ రక్షణకొరకు సంఘటితులగు చున్నారు. అహమ్మదా బాదులో మజదూర్ మహాజన సంస్థ కానీయండి, లేక కమ్యూనిస్టుల ట్రేడు యూనియన్లు కానీయండి- వాని వెనుక నున్న తత్వమిదే. ఈ భావన తప్పు అని మా అభిప్రాయము. ఈ భావన వలన ఎక్కువ లాభముకూడా కలుగుటలేదు. అందుచేత ఆ దృష్టితోను అది సరియైనది కాదు.

## కార్మిక సోదరులారా !

కార్మిక సోదరులారా ! మీరు మీ పొట్ట కూటికొరకు పని చేసుకుంటున్నామని ఎందుకు తలపోస్తున్నారు ? మీరు మొత్తము సమాజానికి సేవ చేస్తున్నారు. జవహర్‌లాల్, వినోబావంటి వారు తమతమ స్థానములనుండి ఏ విధముగా సమాజానికి సేవ చేస్తున్నారో అదేవిధంగా మీరుకూడ మీ శ్రమశక్తి ద్వారా సమాజానికి సేవచేస్తున్నారు. మీరు తయారు చేసే బట్ట సమాజం కొరకు తయారుచేస్తున్నారుకాని మీ కొరకు కాదు కదా. మీరు గనులలో తీసే లోహములు సమాజముకోసమే కాని మీ కొరకు కాదుకదా ! సమాజావసరాలను మీరు తీరుస్తున్నారు. మీరు సమాజసేవ చేస్తున్నప్పుడు సమాజసేవ పూర్తిగా చేయాలని భావించాలి. "మేము సమాజానికి సేవ చేస్తున్నాము కనుక దేశానికి అవసరమైన బట్ట మేము తయారుచేసి యిస్తామ"ని మీరు చెప్పాలి. మిమ్ము

లను మీరు సమాజ సేవకులుగా ఎందుకు భావించుకోరని నేను అడుగుతున్నాను. మేము శక్తివంచన లేకుండ పని చేస్తామని ఎందుకు చెప్పరు? ఇంతగా మీరు సేవచేసిన తరువాత మేము చేసిన సేవకు యింత ప్రతిఫలము కావాలని మీరడగరు. ఇది అడుగవలసిన కోర్కె కాదు. ఎందుచేతనంటే సేవ అంటే సేవయే — తల్లి సేవకు ప్రతిఫలముండదు. ఎవరెవరి శక్తి ననుసరించి వారు సమాజానికి సేవ చేస్తారు. అందుకు వారి వారి అవసరాలను అనుసరించి వారికి కావలసిన వస్తువులు లభించాలి. మీరు పనిచేసి "మేము యింత పని చేశాము, దానికి యింత ప్రతిఫలము యివ్వండ"ని అడుగుతే యిక సర్వోదయ మెక్కడ?

బలహీనంగా నున్న వ్యక్తికి ఎక్కువ అవసరాయుంటాయి. సమాజము అతనికి కావలసినవన్నీ సమకూర్చాలి. బలమైన వ్యక్తికి కొన్ని అవసరాలు అక్కర లేకపోవచ్చు. అలాంటప్పుడు బలహీనుడు తక్కువ పని చేస్తాడు గనుక అతనికి తక్కువ లభించాలని, బలవంతుడు ఎక్కువ పని చేయగలడు గనుక అతనికి ఎక్కువ లభించాలని అంటే ఏమిటి అర్థం? "సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్" బలవంతునిదే రాజ్యము అనుదానికి బదులుగా బలహీనుని సంరక్షించాలని మన అభిప్రాయము. శ్రామికులు సమాజానికి సేవ చేస్తు

న్నారు కనుక తమ ఆవశ్యకతానుసారం సమాజమునుండి పొందుటకు వారి కధికారముంది. అయితే తమకంటే తక్కువ స్థితిలో నున్న కూలి సోదరులకొరకు తాము తమవద్ద నున్నవి యివ్వగలమని తెలియచెప్పాలి. అంటే తమ కూలీ సోదరుల కొరకు కొంత ఆదాయమును సంపత్తి దానముగా యివ్వాలి. ఎక్కువగా అక్కరలేదనుకోండి.

## పీడనలో సహకరించ వద్దు

ఒక చోట వెయ్యిమంది కూలీ లున్నారనుకోండి. అక్కడ ఈ విధముగా ఆలోచించే కార్మిక నాయకుడు వుంటే కార్మికులందరికి ఈవిషయాన్ని నచ్చజెప్పాలి. అప్పుడు వారు దీనిని అర్థము చేసికొని తాము పూర్తిగా సమాజ సేవ చేయగలుగుతా మంటారు. శక్తివంచనలేక పనిచేస్తారు. అవసరాల ననుసరించి కోరుకొంటారు. ఆపైన ఈ కార్మిక సోదరులు యజమానులకు తాము దేశానికి నౌకర్లుగాని యజమానులకు నౌకర్లుగామని చెప్పాలి. "మేము మీ లాభాల కొరకు పనిచేయుట లేదు. లాభము అనుదానిని మే మంగీకరించము. మేము నౌకర్లు అయినట్లుగానే మీరుకూడా నౌకర్లే. ఇద్దరము సమాజ సేవకులమే. మీవద్ద వ్యాపారం చేయుటకు, పరిశ్రమలు నడుపుటకు అవసరమగు బుద్ధి ఉన్నది. దానిని మీరు సమాజాని కివ్వండి. మీరు మమ్ము పీడిస్తూవుంటే ఆ పీడనలో

మీకు మేము సహకరించాలా? మీరు ఈ పీడనను వదలి పెట్టాలి" అని యజమానులకు చెప్పాలి. కార్మిక నాయకులు కేవలము కార్మికనాయకులేకాక సర్వోదయకార్యకర్తలుకూడా. అందుచేత సర్వోదయ కార్యకర్త కేవలము కార్మికులకు నచ్చచెప్పుటయే కాక, యజమానులకు కూడా నచ్చ చెప్పాలి. అప్పుడు యజమానులపై ఏ ప్రభావమూ పడదనుకొనుటకు వీలులేదు.

## కార్ఖానాలు సమాజానివి

యజమానులు దీనిని తెలిసికొన్నపుడు, "మీ జీవిత స్థాయి హెచ్చుగా నున్నది కనుక మీకు కొంత హెచ్చుగా యివ్వమని సమాజానికి మేము సిఫార్సు చేస్తాము. అంతే కాని ఈ కార్ఖానాలు మీవి కావు. ఈ పెట్టుబడి మీదికాదు. ఇవన్నీ సమాజానివి" అని కూలీలు యజమానులకు చెప్పాలి.

## సర్వోదయ మార్గము

ఈ విధంగా కార్మికోద్యమము కొనసాగినట్లయితే పరిణామాలు ఎలా వుండగలవో ఆలోచించండి. ఈ విధంగా ఒక్క కార్ఖానాలోని కూలీలైనా సంకల్పించుకుంటే యజమాని అంగీకరించకపోయినా ఈ వాతావరణము మెరుపు తీగవలె ప్రాకిపోగలదని అనుకుంటాను. కార్మికోద్యమము స్వార్థముల సంఘర్షణలనుండి బయటపడి సర్వోదయ మార్గమున పురోగమిస్తుంది.

ఇతరులను కూడా సేవకులుగా ఉండమని కోరుకొం టున్నాము. అయితే ముందుగా మనం అట్టి భూమికపై జీవితము ఏర్పరచుకొని, ఆపైన యితరులకు చెప్పగలుగు తాము. ఈ విధముగా కార్మికులు తమ యాజమాన్య భావమును విసర్జించి, యితరులను యాజమాన్యము వదలమని అడుగగలరు. ఇట్లు ఒక నైతిక స్థాయి ఏర్పరచుకొని మనము చెప్పవలసినది చెప్పితే మన కోర్కెలు తీర్చుట తప్పనిసరి కాగలదని నా అభిప్రాయము. అప్పుడు మీరు కోరేకోర్కెను ఎవరూ కాదనలేరు. అపుడు ఎవరైనా వ్యతిరేకిస్తే "మీరు చేయుచున్న ఈ లాభసాటి వ్యాపారము, పీడన పాపము" అని వారితో చెప్పండి. "ఇందులో మా స్వార్థమేమీలేదు. అందుచేత పాపములో మేము పాల్గొనలేము. ఈ పాప కార్యమందు మేము సహకరించబోము. సమ్మె విషయము మాకు తెలియదు కాని, మేము మాత్రము ఈ విషయములో సహకరించ దలచుకోలేదు. ఈ కార్ఖానాలు మాకు వదలి పెట్టండి. దేశముకొరకు వాటిని నడుపుతాము. మీ లాభాల కొరకు మేము ఎందుకు నడపాలి?" ఈ విధంగా కార్మిక వాణి ప్రకటమైతే కార్మిక నాయకులు ఈ విషయాలను అర్థముచేసుకుంటే, 10 సం. లలోనే ఈ పెట్టుబడిదారి వ్యవస్థ తొలగిపోయి నూతన వ్యవస్థ ఏర్పడగలుగుతుంది. మేనేజి మెంటు సమస్య నెమ్మదినెమ్మదిగా పరిష్కారము కాగలదు.

## ఆచరణీయ విధానము

ఒక కార్ఖానాను సంపత్తిదానముగా ఇచ్చెదమని ముందు యజమానులు ప్రకటించి, ఆ తర్వాత దానిని అలాగాదనీ, ధర్మకర్తృత్వరీత్యా నడపగలమనీ అన్నారు. యజమానులలో అసలు రానిదానికన్న కొంత మార్పు వచ్చినా మంచిదే కదా? ధర్మకర్తృత్వంగా కొనసాగించుటలో కార్మికుల సమస్య ఎలా అనే ప్రశ్న వచ్చింది. అప్పుడు ఈ విషయాలన్నీ ఆలోచనకు వచ్చాయి. మనము వెళ్ళదలచుకున్న గమ్యానికి యిదే ఆచరణీయ మార్గము. మీరు 2, 3 నెలలు బోనస్ కావలెనని, లేక కరువుభత్యం కావలెనని ఎందుకు కోరుకుంటారు? మీరు మీ ట్రేడ్ యూనియన్ వైపునుండి "కార్మికులగు మేము మాసంపదంతా యిచ్చివేశాము. ఈ సంపద మీదికాదు. మీరు దీనికి ధర్మకర్తగా నుండి సమాజ సేవ చెయ్యండి" అని చెప్పాలి. కార్మికులు ముందుగా తమ స్వార్థాన్ని విసర్జిస్తే,ఆ పైన సాంఘిక నైతిక ఒత్తిడి ఏర్పడుతుంది. విప్లవ వాతావరణం ఏర్పడినపుడు యజమానులు కూడా తమ యాజమాన్యమును వదలగలరు.

## పెట్టుబడిదారులు, యజమానులు ఇద్దరు ట్రస్టీలు కావాలి

కిశోరిలాల్ మశ్రూవాల, నరహరిపరీఖ్, ఇతర మిత్రులను ట్రస్టీషిప్‌కు పరిభాష తయారు చేయమని గాంధీజీ

కోరారు. ఆ పరిభాష తయారుచేయబడి "హరిజన్" లో ప్రచురింపబడినది. ఆ పరిభాష ననుసరించి కొంతమంది పెట్టుబడిదారులు తాము ధర్మకర్తృత్వ విధానములో పనిచేయ గలమని ప్రకటించనుండగా బాపూ హత్యచేయబడ్డారు. బాపూ పరమపదించినా ఆ పెట్టుబడిదారులింకా దేశంలో వున్నారు కదా ? ఒక్క పెట్టుబడిదారుడైనా నేను ఈ విధంగా ట్రస్టీనై కార్మికు లందరిని ట్రస్టీలు చేస్తాను అంటే కార్మికులు ట్రస్టీలు కావలసియుంటుంది. కార్మికుల వద్దనున్న శ్రమశక్తి సమాజం నుండి లభించిందే. ఒకరు బట్ట తయారుచేస్తే యింకొకరు వరి పండించారు. ఏమైనా ఈ శక్తి సమాజం నుండి సమాజము కొరకు వచ్చినదే. కార్మికుడు అన్నము తింటున్నాడు. దానివలన అతనికి పనిచేయగల శక్తి అబ్బింది. అదేవిధంగా అతనికి వచ్చిన చదువు కూడ సమాజంనుండి పొందాడు. నేత, వడకుట లేక సాంకేతిక శిక్షణ అయినాసరే తనకువచ్చిన ప్రతి విద్యను సమాజంనుండి పొందాడు. ఈ విధంగా శ్రమించగలిగే శక్తి, తమ సాంకేతిక నైపుణ్యము, విద్య యివన్నీ సమాజం యిచ్చినవే కనుక సమాజసేవ చేయుట మన ధర్మము అనుకుని ముందుకు సాగాలి.

విజయవాడ
19-12-56

— జయప్రకాశ్ నారాయణ్

# ధర్మకర్తృత్వపు విప్లవాత్మక భావము :3:

కార్మికులలో సర్వోదయ తత్వాన్ని ఎలా ప్రవేశ పెట్టుట అనునది ప్రశ్న. సర్వోదయ తత్వం చదువుకున్న వారికేగాని లేక రైతులకేగాని చెందిందికాదు. అది ఒక సర్వ సంపూర్ణమైన తత్వము. జీవితంలోని అన్ని రంగాలతోనూ దానికి సంబంధమున్నది.

ప్రపంచంలో సుమారు 150 సంవత్సరాల నుంచీ కార్మికోద్యమం కొనసాగుతోంది. అంతటా ప్రజాస్వామ్య, కార్మికోద్యమాలు స్థాపించబడినాయి. అవి కార్మికుల స్థితిని బాగుపరచుటకు చాల ఉపయోగకరమైన కార్యాలు చేశాయి. చాల శక్తివంతమైన కార్మికోద్యమాలు నిర్మించబడ్డాయి. సమాజం పైన, ప్రభుత్వంపైన కూడా వాటి ప్రభావం పడింది. బ్రిటను, అమెరికావంటి దేశాలలో కార్మికోద్యమం సువ్యవస్థిత విధానంలోనూ, వైజ్ఞానిక రీత్యానూ నిర్మింపబడింది. అయితే, ఇంత వరకూ కలిగిన పరిణామాలను చూస్తే కార్మికోద్యమం ఒక దశవరకూ వచ్చి ఆగిపోయినట్లనిపిస్తుంది. కేవలం కార్మికులకు మాత్రమే సౌకర్యాలు సంపాదించి పెట్టడం వరకే వీటి లక్ష్యాలు పరిమిత మయ్యాయి. ఈ సౌకర్యాలలో తేడాలు

రాగానే వారు సమ్మెలవంటి వాటిని ఆశ్రయిస్తారు. స్వీయ స్వార్థ-హితముల సంపాదనయే ఇట్టి ప్రయత్నముల ఉద్దేశ్యమైయుంది. వీనివల్ల సమాజంలోగాని,కార్మికుల జీవితంలోగాని మార్పువస్తునట్లూ లేదు; క్రొత్త విలువల స్థాపనా జరగలేదు. అహ్మదాబాదులో మజ్దూర్-మహాజన సంఘం పనిచేస్తోంది. అది చాల మంచి సంస్థే. అయినా ఈ సంస్థ దృష్టికూడా కార్మికులకు అత్యధిక సౌకర్యాలు చేకూర్చుట మాత్ర మే. వీటిలో సమాజ పరివర్తనము, వర్గపరివర్తనము అనే ప్రసక్తి లేదు. కనుక అన్ని కార్మికోద్యమాలనూ తరచి చూచి, వాటిలో ఎచ్చట మార్పు చేయవలసిన అవసరం ఉన్నదో చూడవలసిన సమయం వచ్చింది.

## ధర్మకర్తృత్వ భావము

గాంధీజీ ధర్మకర్తృత్వమనే ఒక విప్లవాత్మక భావమును మనకు సమర్పించారు. అది కేవలం పెట్టుబడిదారులను మాత్రమే ఉద్దేశించినదికాదు. పెట్టుబడి యెడల ఎట్టి వైఖరి ఉండాలి? వడ్డీ, కిరాయి, లాభాల యెడల ఎట్లు వ్యవహరించాలి అను వాటికే ఇది పరిమితమై లేదు. ఇది ఒక విశాలమైన భావము. జీవితాచరణలోని వివిధ రంగాలతో దీనికి సంబంధమున్నది. ధర్మకర్తృత్వ విధానమునకు కార్య

రూపం దిద్దుటకు సంపత్తిదానము ఒక విధానము; ఒక కార్య క్రమము. కనుక ఈ విప్లవ భావమును కార్మికులు తెలుసు కొనుట అవసరము.

ఈ విషయాన్నిబట్టి కార్మికోద్యమ రూపమే మారిపో తుంది. సంపత్తిదాన భూమికపై కార్మికోద్యమం నిర్మింప బడితే, సమాజ పరివర్తన విషయమై విప్లవాత్మక మార్పు లను తేగలుగుతుంది. ఎందుచేత నంటే ఆ స్థితిలో కార్మికుడు, తాను కేవలం ఫ్యాక్టరీ కూలీననిగాని లేక తన పొట్ట కొరకే తాను పనిచేస్తున్నాననిగాని అనుకోడు. అతను తాను సమా జంలోని ఒక సభ్యుడనని తలచి, సమాజమంతటి కొరకూ పనిచేస్తాడు. అప్పుడు వారు దేశప్రేమ భావప్రేరితులై పని చేస్తారు. నేడు కార్మికులు, ఫ్యాక్టరీల యజమానులు ఒకే భూమికపై ఉన్నారు. ఇద్దరూ తమ తమ సంపాదనలపై తమ హక్కుల నేర్పరచుకుంటున్నారు. ఉన్నభేదమల్లా ఒకరు తన బుద్ధివల్ల ఎక్కువ సంపాదించుకుంటే, రెండవ వారు కష్టించి పనిచేసికూడ ఎక్కువ సంపాదించ లేకపోతు న్నారు. అయితే తమ తమ సంపాదనలపై తమ తమ వ్యక్తి గత యాజమాన్యం తప్పు కాదని అనుకొనుటలో ఇద్దరి మానసిక స్థితీ ఒకటే. పెట్టుబడిదారు ఎక్కువ సంపాదించు కుంటున్నాడే, అనేది మాత్రమే నేడు కార్మికునిలోని ఈర్ష్య.

ఇద్దరి స్వార్థాల సంఘర్షణ ఆరంభ మౌతోంది. అందులో పెట్టుబడిదారుడు విజయుడై కార్మికుడు ఓడిపోతున్నాడు. కనుక స్వాభావికంగానే కార్మికుడు ఈర్ష్య చెందుతున్నాడు. దారిద్ర్యం ఎక్కువగా ఉన్నందువల్ల పరిణామం ఏమంటే పెట్టుబడిదారుని సంపాదనను గుంజుకోవాలను కుంటున్నాడు. ఏ కార్మికునికైనా ఎక్కువ కూలి యిస్తే దానిని తన కూలి సోదరులకు పంచడు. మేనేజరుకూడ కార్మికుడే. అతనికి అధికంగానే వేతనం లభిస్తోంది. అయినా తన పేద సోదరులకు పంచి తాను సమానంగా వేతనం తీసికోడు. కార్మికోద్యమం కార్మికులలో సౌభ్రాత్రం, సాంఘికభావం, పరస్పర త్యాగం నేర్పగలిగితే యధార్థ విప్లవం రాగలుగుతుంది. అప్పుడు 150 సంవత్సరాలలోనూ కార్మికోద్యమం తీసుకు రాలేని స్థితి పరివర్తనాన్ని ఈ మార్గంలో 10, 15 సంవత్సరాలలో తీసుకు రాగలుగుతాము. బ్రిటనులో చాలకాలం నుండి బలిష్ఠమైన ఉద్యమం ఉంది. అచటి కార్మిక సంఘాలు చాల పలుకుబడి కలిగినవి. చాల ఫ్యాక్టరీలు జాతీయం కూడ చేయబడ్డాయి. అయితే ఇంత జరిగినా అచ్చటి కార్మికుల స్థితిలో వచ్చిన భేదమేమి? కార్మికుల స్థితి అట్లే ఉంది; ఆ అసమానతలు అలాగే ఉన్నాయి. కనుక నేడు కార్మికులలో పరిశ్రమలు జాతీయం చేయుట యెడల ప్రత్యేక ఉత్సాహం కనబడుటలేదు.

## సమానత్వ నినాదం

సమానత్వం ఏర్పడాలనేది కార్మికోద్యమపు ముఖ్య నినాదం; కాని కార్మికులే స్వయంగా సమానత్వానికి ఇష్ట పడుట లేదని నాకు అనుభవంలో కనబడుతోంది. నేడు ఏ ఫ్యాక్టరీలోని కూలీలుకూడా తమ అందరికీవచ్చు వేతనాలను కలిపి సమానంగా పంచుకోవాలంటే అంగీకరించరు. అందు చేత కార్మికులలో ముందు ఆంతరంగికంగా పరస్పర సమానత స్థాపించుటకు ప్రయత్నించుట, అందుకు వారి మనస్సులను తయారు చేయుట నేడు కార్మికోద్యమాల పని. ఈ విధంగా ఒక్క సారైనా చేయగలిగామంటే, ఆకాశమెక్కి కూర్చున్న పెట్టుబడిదారులను కార్మికులతో సమాన భూమికపైకి తీసుకు వచ్చుట తేలిక కాగలదు. ఎందుచేతనంటే అప్పుడు కార్మి కులు స్వార్థభావ ప్రేరితులుగా ఉండరు. దానివల్ల వారి నైతిక శక్తి చాల పెరిగి యుంటుంది. ఆ నైతికశక్తి ముందు పెట్టు బడిదారులు తల వొంచక తప్పదు. నేడు మానసిక భావ దృష్ట్యా కార్మికులుకూడ 'పెట్టుబడిదారులే.' ఎందుచేతనంటే అవకాశం లభిస్తే అతనూ పెట్టుబడిదారు డగుటకే ప్రయత్ని స్తాడుగదా. కార్మికుడే విప్లవ నినాదం ఇస్తున్నాడు గనుక, ముందుగా కార్మికులు తమ జీవితంలో విప్లవమును తెచ్చు కోవలసి యుంది. కార్మిక సంఘాలు ఇట్టి నిర్మాణాత్మక

దృష్టిని అలవర్చు కోవాలి. వర్గ సంఘర్షణకు బదులుగా వర్గ నిర్మూలన కొరకు పరస్పర సహకార భావమును పెంపొందించవలసి యుంది.

'మజ్దూర్ - మహాజన్', తదితర కార్మిక సంఘాలు ఈ దెసలో పూనుకోవాలి. దీనిలోని వివిధ విషయాలపై సవివరంగా ఆలోచించి తమ అభిప్రాయాలను ప్రకటించాలి. గాంధీజీ వెలువరించిన ధర్మకర్తృత్వ భావముపై కార్మికోద్యమమును నిర్మించుటకు సంపత్తిదానము అవకాశము కల్పిస్తున్నది. స్పష్టమైన దృష్టితో దీనివిషయమై ఆలోచించండి. 'తమవద్దనున్న శక్తి సమాజ మిచ్చినదే, కనుక తమవద్దనున్న దానిని సమాజానికి సమర్పించాలి; శక్త్యానుసారం పనిచేసి, అవసరాల ననుసరించి తీసుకోవాలి' అను సామాజిక దర్శనముపై కార్మికులకు శ్రద్ధను, విశ్వాసమును కలిగించ గలిగితే సర్వోదయంవైపు తీసుకు వెళ్లగలుగు గొప్ప విప్లవం జరుగగలదని నా నమ్మకము.

కాంచీపురం
26–5–56

— జయప్రకాశ్ నారాయణ్

ఈ పుస్తకము 5వేల కాపీలకు అగు ముద్రణ ఖర్చులను శ్రీ జి. నరసయ్యాపంతులుగారు భరించి సర్వోదయ సాహిత్య ప్రచారాభివృద్ధికి తోడ్పడిరి. వారికి మా కృతజ్ఞతలు.

ఇట్లే ఇంకనూ దాతలు ముందుకువచ్చి ఒక్కొక్క పుస్తకము ముద్రణ ఖర్చులను భరించి తోడ్పడి ఈ యుగకార్యమును పురోగమింపజేయ వలసిందని ప్రార్థించుచున్నాము.

రామకృష్ణధూత్

సంచాలకులు

స. సా. ప్ర. సమితి.

# భూదాన సాహిత్యము

| | | రు. న.పై |
|---|---|---|
| గీతా ప్రవచనములు | వినోబా | 1·00 |
| శిక్షణ విచారధార | ,, | 1·50 |
| సాహిత్యం - సాహితీవేత్తలు | ,, | 0 65 |
| ప్రజావిప్లవ పథము | ,, | 0·50 |
| వర్తకులకు పిలుపు | ,, | 0·15 |
| కార్మికులారా! కదలండి! | వినోబా & జయప్రకాశ్ నారాయణ్ | 0·15 |
| వినోబా జీవితం | లవణం | 0·20 |
| విద్యార్థులారా రండి | ,, | 0·15 |
| సంపత్తి దానము | శ్రీకృష్ణదాస్ జాజూ | 0·50 |
| వినోబా సన్నిధిలో | నిర్మల దేశపాండే | 1·25 |
| భూదాన ఆరోహణము | నారాయణ దేశాయి | 0·75 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0·50 |
| విప్లవ పురోగమనము | దాదా ధర్మాధికారి | 0·30 |

## సర్వోదయ సాహిత్య ప్రచారసమితి

గాంధీభవన్ :: హైద్రాబాదు

అతిసూక్ష్మంగా శ్రమ విభాగం చేసి, కార్మికుని జడయంత్రంవలె తయారుచేసి, నీరసమైన యాంత్రిక కర్మలో నాలుగైదు గంటలు అతనిని కట్టివేసి ఆపైన భోగలాలసతకు, ఆనందం పొందుటకుగాను అతనిని విడిచివేయుటవలన మానవజాతికి మేలు లేదు. ఇందుకు భిన్నంగా తాను చేయు పనిలోనే ఆనందం పొందుతూ, అదే అతనికి ఇష్టమైన కార్యంగా రూపొంది, అందులోనే కార్మికుని ఆధ్యాత్మికోన్నతి జరుగు నట్లుగా పారిశ్రామిక వ్యవస్థను సంస్కరించవలెను. అట్టి దారులను వెతకవలెను.

— *గాంధీజీ*

# కార్మికులారా కదలండి

వినోబా

• జయప్రకాశ్ నారాయణ్

సర్వసేవాసంఘం ప్రచురణ